# అథ ద్విచత్వారింశో%ధ్యాయః

## ద్వాదశ జ్యోతిర్లింగములు

నందీశ్వర ఉవాచ ।

అవతారన్ శృణు విభోర్ద్వాదశప్రమితాన్ పరాన్ । జ్యోతిర్లింగ స్వరూపాన్ వై నానోతి కారకాన్మునే ।। 1

సౌ రాష్ట్రే సోమనాథశ్చ శ్రీ శైలే మల్లికార్జునః । ఉజ్జయిన్యాం మహాకాల ఓంకారే చామరేశ్వరః ।। 2

కేదారో హిమవత్పృష్ఠే డాకిన్యాం బీమ శంకరః । వారాణస్యాం చ విశ్వేశస్త్ర్యంబకో గౌతమీతటే ।। 3

వైద్యనాథశ్చితా భూమౌ నాగేశో దారుకావనే । సేతుబంధే చ రామేశో ఘుశ్మేశశ్చ శివాలయే ।। 4

అవతారద్వాదశకమేతచ్చంభోః పరాత్మనః । సర్వానందకరం పుంసాం దర్శనస్పర్శనాన్మునే ।। 5

తత్రత్ర ద్యస్సోమనాథో హి చంద్రదుఃఖక్షయంకరః । క్షయకుష్ఠాదిరోగాణాం నాశకః పూజనాన్మునే ।। 6

శివావతారస్సోమేశో లింగరూపేణ సంస్థితః । సౌరాష్ట్రే శుభ##దేశే చ శశినా చ పూజితః పురా ।। 7

నందీశ్వరుడిట్లు పలికెను-

ఓ మహర్షీ! శ్రేష్ఠమైనవి, బ్యోతిర్లింగ రూపములో నున్నవి, అనేక లీలలను ప్రదర్శించునవి అగు పన్నెండు పరమేశ్వరావతారములను గూర్చి వినుమ (1). సౌరాష్ట్ర దేశములో సోమనాథుడు, శ్రీశైలములో మల్లికార్జునుడు, ఉజ్జయినిలో మహాకాలుడు, ఓంకారములో అమరేశ్వరుడు (2). హిమవచ్ఛిఖరముపై కేదారేశ్వరుడు, డాకినిలో భీమశంకరుడు, వారాణసిలో విశ్వేశుడు, గౌతమీ తీరమునందు త్ర్యండకుడు (3),

చితాభూమిలో వైద్యనాథుడు, దారుకావనములో నాగేశుడు, సేతు బంధములో రామేశ్వరుడు, శివాలయములో ఘుశ్మేశుడు (4) అనునవి పరమాత్మయగు శంభుని పన్నెండు అవతారములు. ఓ మునీ! ఈ లింగములు మానవులకు స్పృశించుటచే మరియు దర్శించుటచే సర్వానందములనిచ్చును (5). ఓ మునీ! వాటిలో మొదటిది సోమనాథుడు. ఆయన చంద్రుని దుఃఖమును పోగొట్టినాడు. ఆయనను పూజించినచో క్షయ, కుష్ఠ ఇత్యాది రోగములు తొలగిపోవును (6). శివుడు పూర్వము మంగళకరమగు సౌరాష్ట్రదేశములో లింగరూపములో ఆవిర్భవించగా చంద్రుడు ఆయనను అర్చించెను (7).

చంద్రకుండం చ తత్రైవ సర్వపాపవినాశకమ్ | తత్ర స్నాత్వా నరోధీమాన్ సర్వరోగైః ప్రముచ్యతే || 8

సోమేశ్వరం మహాలింగం శివస్య పరమాత్మకమ్ | దృష్ట్వా ప్రముచ్యతే పాపాత్ భక్తిం ముక్తించ విందతి || 9

మల్లికార్జున సంజ్ఞశ్చావతారశ్శంకరస్య వై | ద్వితీయశ్శ్రీగిరౌ తాత భక్తాభీష్టఫలప్రదః || 10

సంస్తుతో లింగరూపేణ సుతదర్శనహేతుతః | గతస్తత్ర మహాప్రీత్యా స శివస్స్వగిరేర్మునే || 11

జ్యోతిర్లింగం ద్వితీయం తద్దర్శనాత్పూజనాన్మునే | మహాసుఖకరం చాంతే ముక్తిదం నాత్ర సంశయః || 12

మహాకాలాభిధస్తాతావతార శ్శంకరస్య వై | ఉజ్జయిన్యాం నగర్యాం చ బభూవ స్వజనావనః || 13

దూషణాఖ్యాసురం యస్తు వేదధర్మ ప్రమర్దకమ్ | ఉజ్జయిన్యాం గతం విప్రద్వేషిణం సర్వనాశనమ్ || 14

వేద విప్ర సుతధ్యాతో హుంకారేణైవ స ద్రుతమ్ | భస్మసాత్కృతవాంస్తం చ రత్నమాలనివాసినమ్ || 15

తం హత్వా స మహాకాలో జ్యోతిర్లింగ స్వరూపతః | దేవైస్స
ప్రార్థితో% తిష్ఠత్స్వభక్తపరిపాలకః || 16

అచటనే సర్వపాపములను పోగొట్టే చంద్రకుండము గలదు. బుద్ధి మంతుడగు మానవుడు దానియందు స్నానము చేసి రోగములన్నిటినుండి విముక్తిని పొందవచ్చును (8). పరమాత్మ స్వరూపమగు శివుని సోమేశ్వరమహాలింగమును దర్శించు మానవుడు పాపమునుండి విముక్తిని భక్తిని మరియు ముక్తిని పొందును. (9). వత్సా! భక్తుల అభీష్టఫలములనిచ్చు శంకరుడు శ్రీగిరియందు మల్లికార్జునుడను పేరుతో అవతరించెను. ఇది రెండవ జ్యోతిర్లింగము (10). పుత్రసంతానమును కోరువారు లింగరూపములో నున్న మల్లికార్జునుని స్తుతించెదరు. ఓ మునీ! శివుడు తన కైలాసమునండి శ్రీ శైలమునకు మహానందముతో విచ్చేసెను (11). ఓ మునీ! ఆ రెండవ జ్యోతిర్లింగమును దర్శించి పూజించువారికి మహాసుఖములు కలుగుటయే గాక మరణించిన పిదప ముక్తి లభించుననుటలో సందియము లేదు (12). వత్సా! తన భక్తులను మహాకాలుడను పేర కాపాడే శివుని అవతారము ఉజ్జయినీ నగరములో ఆవిర్భవించెను (13). దూషణడను రాక్షసుడు వేదధర్మమును నశింపజేయువాడై బ్రాహ్మణులను ద్వేషిస్తూ ఉజ్జయినిలో గల సర్వమును నాశనము చేసెను. అపుడు బ్రాహ్మణులు వారి పుత్రులు వేదములతో శివుని ప్రార్థించగా ఆయన వెంటనే రత్నమాల నగర నివాసియగు ఆ దూషణుని హుంకారముచే భస్మము చేసెను (14, 15). తన భక్తులను రక్షించే ఆ మహాకాలుడు దేవతలచే ప్రార్థింపబడినవాడై అచటనే జ్యోతిర్లింగరూపములో ఆవిర్భవించి స్థిరముగా నుండెను (16).

మహాకాలాహ్వాయం లింగం దృష్ట్వాభ్యర్చ్య ప్రయత్నతః | సర్వాన్
కామానవాప్నోతి లభ##తే పరతో గతిమ్ || 17

ఓంకారః పరమేశానో ధృతశ్శంభోః పరాత్మనః | అవతారశ్చతుర్థో హి
భక్తా భీష్టఫలప్రదః || 18

విధినా స్థాపితో భక్త్యా స్వలింగాత్పార్థివాన్మునే | ప్రాదుర్భూతో
మహాదేవో వింధ్యకామప్రపూరకః || 19

దేవైస్సంప్రార్థితస్తత్ర ద్విధారూపేణ సంస్థితః | భుక్తిముక్తిప్రదో లింగరూపో వై భక్త వత్సలః || 20

ప్రణవే చైవ చోంకార నామాసీల్లింగముత్తమమ్ | పరమేశ్వరనామాసీత్పార్థివశ్చ మునీశ్వర || 21

భక్తాభీష్టప్రదో జ్ఞేయో యో %పి దృష్టో %ర్చితో మునే | జ్యోతిర్లింగే మహాదివ్యే వర్ణితే తు మహామునే || 22

కేదారేశో%వతారస్తు పంచమః పరమశ్శివః | జ్యోతిర్లింగ స్వరూపేణ కేదారే సంస్థితస్స చ || 23

మహాకాలేశ్వరలింగమును దర్శించి శ్రద్ధతో అర్చించు మానవుడు సమస్తమైన అభీష్టములను పొందుటయే గాక, మరణించిన పిదప ఉత్తమ గతిని పొందును (17). శంభుపరమాత్మ ఓంకారేశ్వరుని రూపములో కూడ అవతరించినాడు. ఈ నాల్గవ అవతారము భక్తులకు ఫలము నిచ్చి కోర్కెలనీడేర్చుచున్నది (18). వింధ్యుడు యథావిధిగా శివలింగమును స్థాపించి భక్తితో అర్చించెను. ఓ మునీ! ఆ పార్థివలింగము నుండి మహాదేవుడు ఆవిర్భవించి వింధ్యుని కోర్కెను తీర్చెను (19). లింగరూపములో భక్తులకు భుక్తిని ముక్తిని ఇచ్చువాడు, భక్తప్రియుడునగు శివుడు దేవతల ప్రార్థనను మన్నించి అచట రెండు రూపములలో ఆవిర్భవించెను (20). ఓ మహర్షీ! వాటిలో ఒకటి ఓంకారములో ఓంకారేశ్వరుడను పేర ఆవిర్భవించిన ఉత్తమలింగము. పరమేశ్వరుడు అను పేరు గల పార్థివలింగము రెండవది (21). ఓ మహర్షీ! పైన వర్ణింపబడిన మహాదివ్యములగు ఈ రెండు జ్యోతిర్లింగములలో ఏ ఒక్కదానినైననూ దర్శించి అర్చించు భక్తుల అభీష్టములను పరమేశ్వరుడు తీర్చును (22). పరమశివుడు కేదారమునందు కేదారేశ్వరుడను పేర అయిదవ జ్యోతితర్లింగముగా అవతరించి యున్నాడు (23).

నరనారాయణాఖ్యౌ యావవతారౌ హరేర్మునే | తత్ప్రార్థితశ్శివస్తత్ర స్థితః కేదారే హిమభూభూధరే || 24

తాభ్యాం చ పూజితో నిత్యం కేదారేశ్వరసంజ్ఞకః | భక్తా
భీష్టప్రదశ్శంభుర్దర్శనాదర్చనాదపి || 25

అస్య ఖండస్య స స్వామీ సర్వేశో %పి విశేషతః |
సర్వకామప్రదస్తాత సో %వతార శ్శివస్యవై || 26

భీమశంకరసంజ్ఞస్తు షష్ఠశ్శంభోర్మహాప్రభోః | అవతారో మహాలీలో
భీమాసురవినాశనః || 27

సుదక్షిణాభిధం భక్తం కామరూపేశ్వరం నృపమ్ | యో
రరక్షాద్భుతం హత్వాసురం తం భక్తదుఃఖదమ్ || 28

భీమశంకరానామాస డాకిన్యాం సంస్థిథితస్స్వయమ్ |
జ్యోతిర్లింగస్వరూపేణ ప్రార్థితస్తేన శంకరః || 29

విశ్వేశ్వరావతారస్తు కాశ్యాం జాతో హి సప్తమః |
సర్వబ్రహ్మాండరూపశ్చ భుక్తి ముక్తి ప్రదో మునే || 30

ఓ మహర్షీ! హిమవత్పర్వతమునందలి కేదారములో హరియొక్క అవతారములగు నరనారాయణులు గలరు. వారు మరియు అచటనున్న ఇతరులు ప్రార్థించగా శివుడు అచట కేదారేశ్వరనామముతో అవతరించి ప్రతిదినము వారిద్దరి పూజలనందుకొనుచున్నాడు. కేదారేశ్వరుని దర్శించి అర్చించు భక్తుల కోర్కెలను శంభుడు నెరవేర్చును (24, 25). వత్సా! శివుడు సర్వేశ్వరుడే అయిననూ, ఈ అవతారములో విశేషించి ఆ ప్రాంతమునకు ప్రభువై వెలసినాడు ఈ శివావతారము కోర్కెల నన్నిటినీ ఈడేర్చునని ప్రసిద్ధి (26). గొప్ప లీలలను నెరపు శంభుమహాప్రభుడు భీమశంకరుడను పేర ఆరవ సారి అవతరించి భీమాసురుని సంహరించినాడు (27). సుదక్షిణుడను పేరుగల భక్తుడగు కామరూప దేశప్రభువును, భక్తులకు దుఃఖమును కలుగజేయు భయంకరుడగు భీమాసురుని బారినుండి ఆయన రక్షించెను (28). ఆ రాజుయొక్క ప్రార్థనను మన్నించి శంకరుడు డాకినీ నగరములో భీమశంకరుడను పేర జ్యోతిర్లింగమై స్వయముగా వెలసియున్నాడు (29). ఓ మునీ! సర్వ

బ్రహ్మాండస్వరూపుడు, భుక్తిని ముక్తిని ఇచ్చువాడు నగు శంకరుడు కాశీనగరములో విశ్వేశ్వరుడై ఏడవ జ్యోతిర్లింగముగా అవతరించినాడు(30).

పూజితస్సర్వదేవైశ్చ భక్త్యా విష్ణ్వా దిభిస్సదా | కైలాసపతినా చాపి భైరవేణాపి నిత్యశః || 31

జ్యోతిర్లింగస్వరూపేణ సంస్థితస్తత్ర ముక్తిదః | స్వయం సిద్ధస్వరూపో హి తథా స్వపురి స ప్రభుః || 32

కాశీ విశ్వేశయోర్భక్త్యా తన్నామజపకారకాః | నిర్లిప్తాః కర్మభిర్నిత్యం కైవల్యపదభాగినః || 33

త్ర్యంబకాఖ్యో%వతారో యస్సో%ష్టమో గౌతమీతటే | ప్రార్థితో గౌతమేనావిర్బభూవ శశిమౌలినః || 34

గౌతమస్య ప్రార్థనయా జ్యోతిర్లింగ స్వరూపతః | స్థితస్తత్రాచలః ప్రీత్యా తన్మనేః ప్రీతికామ్యయా || 35

తస్య సందర్శనాత్ స్పర్శాద్దర్శనాచ్చ మహేశితుః | సర్వే కామాః ప్రసిధ్యంతి తతో ముక్తిర్భవేదహో || 36

శివానునగ్రహతస్తత్ర గంగానామ్నా తు గౌతమీ | సంస్థితా గౌతమప్రీత్యా పావనీ శంకరప్రీయా || 37

విష్ణువు మొదలగు సర్వదేవతలు, కైలాసగిరీశుడు మరియు భైరవుడు కూడ ఆయనను నిత్యము భక్తితో పూజించెదరు (31). ముక్తి దాతయగు శివప్రభుడు స్వీయనగరమలో స్వయంభూజ్యోతిర్లింగ స్వరూపుడై వెలసియున్నాడు (32). ఎవరైతే కాశీనగరమును, విశ్వేశ్వరుని ఆరాధించి భక్తితో శివుని నామమును జపించెదరో వారు సర్వదా కర్మ బంధమునుండి విముక్తులై కైవల్యపదమును పొందెదరు (33). చంద్రమౌళి యొక్క ఎనిమిదవ త్ర్యండకావతారము గౌతమి మహర్షి ప్రార్థించగా గౌతమీ నదీ తీరమునందావిర్భవించెనను (34). గౌతమ మహర్షి ప్రార్థనచే ఆ మహర్షికి ప్రీతిని కలిగించ గోరి శివుడు జ్యోతిర్లింగ రూపములో అచట

స్థిరముగా నున్నాడు (35). ఆశ్చర్యము! ఆ మహేశ్వరుని దర్శించి స్పృశించువారలకు కోర్కెలన్నియూ ఈడేరుటయే గాక, దేహ త్యాగము తరువాత ముక్తి కలుగును (36). శివునకు ప్రియురాలు పావనియగు గంగ శివుని అనుగ్రహము వలన గౌతమునకు ప్రీతిని కలిగించుటకై అచట గౌతమి యను పేరుతో ప్రవహించెను (37).

వైద్యనాథావతారో హి నవమస్తత్ర కీర్తితః | ఆవిర్భూతో రావణార్థం బహులీలాకరః ప్రభుః || 38

తదానయనరూపం హి వ్యాజం కృత్వా మహేశ్వరః | జ్యోతిర్లింగస్వరూపేణ చితాభూమౌ ప్రతిష్ఠితః || 39

వైద్యనాథేశ్వరో నామ్నా ప్రసిద్ధో %భూజ్జగత్త్రయే | దర్శనాత్పూజనాద్భక్త్యా భుక్తిముక్తి ప్రదస్స హి || 40

వైద్యనాథేశ్వరశివమాహాత్మ్యమను శాసనమ్ | పఠతాం శృణ్వతాం చాపి భుక్తిముక్తిప్రదం మునే || 41

నాగేశ్వరావతారస్తు దశమః పరికీర్తితః | ఆవిర్భూతస్స్వభక్తార్థం దుష్టానాం దండదస్సదా || 42

హత్వా దారుకనామానం రాక్షసం ధర్మఘాతకమ్ | స్వభక్తం వైశ్యనాథం చ ప్రారక్షత్సు ప్రియాభిధమ్ || 43

లోకానాముపకారార్థం జ్యోతిర్లింగస్వరూపధృక్ | సంతస్థౌ సాంబికశ్శంభుర్బహులీలాకరః ప్రభుః || 44

ఆ జ్యోతిర్లింగములలో తొమ్మిదవ అవతారము వైద్యనాథుడు. అనేకలీలలను ప్రకటించు ఆ ప్రభుడు రావణుని కొరకై ఆ రూపములో ఆవిర్భవించినాడు (38). రావణుడు తనను గొని పోవుట అను మిషను ఆధారముగా చేసుకొని మహేశ్వరుడు చితాభూమియందు జ్యోతిర్లింగ స్వరూపములో వెలసి యున్నాడు (39). వైద్యనాథేశ్వరుని పేరు ముల్లోకములలో ప్రసిద్ధిని గాంచెను. ఆయనను భక్తితో దర్శించి పూజించు వారలకు ఆయన భుక్తిని ముక్తిని కూడ ఇచ్చును (40). ఓ మహర్షీ ! వైద్యనాథేశ్వరుని

రూపములో అవతరించిన శివుని మహత్మ్యమును మరియు ఈ ఉపదేశమును పఠించువారలకు మరియ వినువారలకు కూడ భుక్తి, ముక్తి లభించును (41). పదియవ అవతారము నాగేశ్వరుడని కీర్తింపబడినాడు. సర్వదా దుష్టులను శిక్షించు శివుడు తన భక్తుని కొరకై ఆ రూపములో ఆవిర్భవించినాడు(42). ఆయన ధర్మవిధ్వంసియగు దారుకాసురుని సంహరించి వైశ్యప్రభువు, తనకు భక్తుడు అగు సుప్రియుని రక్షించెను (43). అనేక లీలలను ప్రకటించు ఆ శంభు ప్రభుడు లోకములకు ఉపకారమును చేయుట కొరకై పార్వతితో గూడి జ్యోతిర్లింగరూపములో ప్రకటమై స్థిరముగా నెలకొనెను (44).

తద్దృష్ట్వా శివలింగం తు మునే నాగేశ్వరాభిధమ్ | వినశ్యంతి ద్రుతం చార్చ్య మహాపాతకరాశయః || 45

రామేశ్వరావతారస్తు శివస్యై#ాకాదశః స్మృతః | రామచంద్ర ప్రియకరో రామసంస్థాపితో మునే || 46

దదౌ జయవరం ప్రీత్యా యో రామాయ సుతోషితః | ఆవిర్భూతస్సలింగస్తు శంకరో భక్తవత్సలః || 47

రామేణ ప్రార్థితో%త్యర్థం జ్యోతిర్లింగ స్వరూపతః | సంతస్థౌ సేతుబంధే చ రామసంసేవితో మునే || 48

రామేశ్వరస్య మహిమాద్భుతోభూద్భువి చాతులః | భుక్తి ముక్తిప్రదశ్చైవ సర్వదా భక్తకామదః || 49

తం చ గంగాజలేనైవ స్నాపయిష్యతి యో నరః | రామేశ్వరం చ సద్భక్త్యా స జీవన్ముక్త ఏవ హి || 50

ఇహ భుక్త్వాఖిలాన్ భోగాన్ దేవతా దుర్లబానపి | అతః ప్రాప్య పరం జ్ఞానం కైవల్యం మోక్షమాప్నుయాత్ || 51

ఓ మునీ ! నాగేశ్వరుడను పేరు గల శివలింగమును చూచి అర్చించినచో, వెంటనే మహాపాపముల గుట్టలైననూ పూర్తిగా నశించును (45). శివుని పదకొండవ అవతారము రామేశ్వరుడని

స్మరింపబడినది. ఓ మునీ ! రామునిచే స్థాపించ బడిన ఆ రామేశ్వరుడు రామచంద్రునకు హితమును కల్గించినాడు (46). భక్త ప్రియుడగు ఆ శంకరుడు లింగరూపములో ఆవిర్భవించి మిక్కిలి సంతసించినవాడై రామునకు విజయమును వరముగా నిచ్చెను (47). ఓ మునీ! రామునిచే సేవింపబడిన ఆ శివుడు రామునిచే అధికముగా ప్రార్థింపబడి సేతుబంధమునందు స్థిరముగా వెలసెను (48). రామేశ్వరుని మహిమ అద్భుతమేనది. భూలోకములో దాని సాటి మరియొకటి లేదు. రామేశ్వరుడు సర్వదా భక్తులకు కామములను, భుక్తిని, ముక్తిని కూడ ఇచ్చుచుండును (49). ఏ మానవుడు ఆయనను గంగా జలముతో మహాభక్తి పూర్వకముగా అభిషేకించునో, ఆ మానవుడు ఆ రామేశ్వరుని అనుగ్రహముచే జీవన్ముక్తుడగును (50). అట్టివాడు ఇహలోకములో దేవతలకు కూడ దుర్లభమగు భోగములన్నిటినీ అనుభవించి దేహత్యాగానంతరము పరమ జ్ఞానమును మోక్షమును పొందును(51).

ఘుశ్మేశ్వరావతారస్తు ద్వాదశశ్శంకరస్య హి | నానాలీలాకరో ఘుశ్మానందదో భక్తవత్సలః || 52

దక్షిణస్యాం దిశి మునే దేవశైల సమీపతః | ఆవిర్బభూవ సరసి ఘుశ్మా ప్రియకరః ప్రభుః || 53

సుదేహయామారితం ఘుశ్మాపుత్రం సాకల్యతో మునే | తుష్టస్తద్భక్తితశ్శంభుర్యో %రక్షద్భక్తవత్సలః || 54

తత్ప్రార్థితస్స వై శంబుస్తడాగే తత్ర కామదః | జ్యోతిర్లింగ స్వరూపేణ తస్థౌ ఘుశ్మేశ్వరాభిధః || 55

తం దృష్ట్వా శివలింగం తు సమభ్యర్చ్య చ భక్తితః | ఇహ సర్వసుఖం భక్త్వా తతో ముక్తిం చ విందతి || 56

ఇతి తే హి సమాఖ్యాతా జ్యోతిర్లింగావలీ మయా | ద్వాదశప్రమితా దివ్యా భుక్తి ముక్తిప్రదాయినీ || 57

ఏతాం జ్యోతిర్లింగ కథాం యః పఠేచ్ఛృణుయాదపి | ముచ్యతే సర్వపాపేభ్యో భుక్తిం ముక్తిం చ విందతి || 58

శతరుద్రా భిధా చేయం వర్ణితా సంహితా మయా | శతావతారసత్కీర్తి స్సర్వకామఫలప్రదా || 59

ఇమాం యః పఠతే నిత్యం శృణుయాద్వా సమాహితః | సర్వాన్ కామానవాప్నోతి తతో ముక్తిం లభేద్ధ్రువమ్ || 60

ఇతి శ్రీ శివమహాపురాణ   శతరుద్రసంహితాయాం ద్వాదశ జ్యోతిర్లింగ వర్ణనం నామ ద్విచత్వారింశో %ధ్యాయః (42)

|| సమాప్తా శతరుద్రసంహితా ||

శంకరుని పన్నెండవ అవతారము ఘుశ్మేశ్వరుడు. భక్తవత్సలుడగు శివుడు అనేకలీలలను ప్రకటించి ఘుశ్మకు ఆనందమును కలిగించెను (52). ఓ మునీ! దక్షిణ దిక్కునందు దేవశైలమునకు సమీపములో శివుడు సరస్సునందు ఆవిర్భవించి ఘుశ్మకు ప్రీతిని కలిగించినాడు (53). ఓ మహర్షీ! సుదేహ ఘుశ్మయొక్క పుత్రుని సంహరించగా, అమెభక్తికి భక్త వత్సలుడగు శంభుడు సంతసించి ఆతనిని పూర్తిగా రక్షించెను (54). ఆమె ప్రార్థించగా ఆ శంభుడు ఆమె కోర్కెను ఈడేర్చువాడై అచటి సరస్సులో ఘుశ్మేశ్వరుడను పేర జ్యోతిర్లింగరూపుడై వెలసెను (55). ఆ శివలింగమును దర్శించి భక్తితో ఆరాధించు వ్యక్తి ఇహలోకములో సుఖములనన్నిటినీ అనుభవించి తరువాత ముక్తిని కూడ పొందును (56). ఈ తీరున నేను నీకు భుక్తిని ముక్తిని ఇచ్చే దివ్యమగు పన్నెండు జ్యోతిర్లింగముల క్రమమును చక్కగా చెప్పియుంటిని (57). ఈ జ్యోతిర్లింగవృత్తాంతమును ఎవడు పఠించునో, లేక వినునో వాడు పాపములన్నింటి నుండి విముక్తుడై భుక్తిని మరియు ముక్తిని పొందును (58). నేను ఇంతవరకు శతరుద్రసంహితను వర్ణించితిని. కోర్కెలనన్నిటినీ ఈడేర్చ ఫలములనిచ్చే ఈ సంహితయందు వంద అవతారముల పుణ్యకీర్తి

వర్ణింపబడినది (59). ఎవడైతే దీనిని నిత్యము పఠించునో లేదా సమాహితచిత్తుడై వినునో, వాడు అభీష్టముల నన్నింటినీ పొంది పిదప నిశ్చయముగా ముక్తిని పొందును (60).

శ్రీ శివమహాపురాణములో శతరుద్ర సంహితయందు ద్వాదశజ్యోతిర్లింగ వర్ణనమనే నలుబది రెండ అధ్యాయము ముగిసినది (42).

|| శతరుద్ర సంహిత ముగిసినది ||

హరిః ఓం తత్సత్

శ్రీకృష్ణార్పణమస్తు